



ఒక పచ్చటి, దట్టమైన అడవి చివర, ఒక ఊరికి దగ్గరలో ఒక పిరికి నక్క ఉండేది. దాని పేరు '*గట్టి ఊళ*. అది ఇతర జంతువులంటే భయపడుతూ ఎక్కువ సమయం ఒక గుహలో దాక్కుని ఉండేది.

ఒక్కొక్కసారి 'గట్టి ఊళ'కి భయంకరమైన కలలు వచ్చేవి. బాకుల్లాంటి పంజా గోళ్లతో ఒక పెద్ద పులి తనని తరుముతున్నట్టు అది కలగనేది.

సాయం సంధ్యలో మిగిలిన నక్కలతో కలిసి గుంపుగా ఉన్నప్పుడు మాత్రమే 'గట్టి ఊళ'కి ధైర్యంగా ఉండేది. అది అందరికంటే పెద్దగా, అందరికంటే ఎక్కువసేపు ఊళ వెయ్యగలదు కాబట్టి తాను ఎంతో గొప్పదానినని అది అనుకునేది.


వేటాడటానికి 'గట్టి ఊళ' భయపడటం వల్ల అది చాలా సార్లు ఆకలితో ఉండిపోయేది. ఆ రోజంతా ఏమీ తిననందువల్ల సాయంత్రానికి దాని పేగులు అరవ సాగాయి.
ఆ నక్క ఊరి సంత దగ్గరకు చేరుకుని ఒక పొద మాటున దాక్కుంది. ఇళ్లల్లో వండుతున్న రకరకాల కూరల వాసనలు వస్తున్నాయి.
ఇద్దరు పిల్లలు చెరుకు ముక్క నములు తున్నారు. ఒక ముక్క రుచి చూడగలిగితే!
అంతలో ఒక పెద్ద, భయంకరమైన కుక్క నిలబడి గుర్రుపెట్టసాగింది. నక్కి ఉన్న నక్క వాసనను అది పసిగట్టింది...



ఉన్నట్టుండి ఊళ్లోని కుక్కలన్నీ దాని వెంట పడ్డాయి. ‘గట్టి ఊళ’ తన ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని పరిగెత్తసాగింది.



చీల్చి చెండాటానికి సిద్ధంగా ఉన్న కుక్కలకీ, నక్కకీ మధ్య దూరం తగ్గుతోంది. రంగులు అద్దే వ్యక్తి పెరడులోకి నక్క దూరింది. రంగులు అద్ది ఆరేసిన చీరలను తప్పించుకుంటూ నక్క పరిగెత్తింది.

ఉన్న శక్తినంతటినీ కూడగట్టుకుని నక్క ఒక్క దూకు దూకింది. దాంతో అది నీలిరంగు కలిపి ఉన్న ఒక తొట్టిలో పడింది.





పాపం, నీలి రంగులో మునిగిన గట్టి ఊళకి ఊపిరి ఆడటం లేదు. దాని కళ్లల్లోకి, చెవుల్లోకి నీళ్లు వెళుతున్నాయి. అయితే. కుక్కలు దగ్గరలోనే ఉండటంతో అది తుమ్మటానికి, దగ్గటానికి ధైర్యం చెయ్యలేదు.

అది నీలి రంగు తొట్టిలో మునిగి ఉండి ఊపిరి బిగపట్టింది. చల్లటి నీలి రంగుతో దాని వళ్లంతా నానిపోతోంది. చేపల బుచ్చిగాడి కంటే మెరిసిపోయే నీలంలో ఉంది ఆ రంగు.

ఆ తొట్టి చుట్టూ కుక్కలు వాసన చూస్తూ, గుర్రుమంటూ తిరిగాయి. కాని నక్క జాడ వాటికి చిక్కలేదు. అది తప్పించుకునిపోయిందని అనుకుని ఆ కుక్కలు అక్కడి నుంచి వెళ్లిపోయాయి.





అంతటా ప్రశాంతతత నెలకొన్న తరవాత ‘గట్టి ఊళ’ ముక్కుని తొట్టి అంచుకి పెట్టి వాసన చూసింది. దానికి ఎక్కడా కుక్కల వాసన రాలేదు. తరవాత కళ్లను తొట్టి పైకి తెచ్చి చుట్టూ పరికించి చూసింది. ఎక్కడా కుక్కలు కనిపించలేదు.

అంతలోనే ‘గట్టి ఊళకి’ ఏవో మాటలు వినిపించాయి. అవి రానురాను దగ్గరవుతున్నాయి. రంగులు అద్ది, తాడు మీద ఆరేసిన బట్టలు తియ్యటానికి ఆడవాళ్లు వస్తున్నారు. ఒక తొట్టిలో నుంచి మెరిసే నీలం రంగులోని జంతువు ఒకటి బయటకు రావటం చూసి వాళ్లు ఆశ్చర్యపోయారు.

అందరూ ఒక్కసారిగా అరవసాగారు...









అక్కడి నుంచి తప్పించుకోవాలన్న ఆలోచన ఒక్కటే 'గట్టి ఊళ' మనసులో ఉంది. తన కాళ్లు తీసుకెళ్లగలిగినంత వేగంగా అది అడవి వైపుకి దౌడు తీసింది.



నీలి రంగులో వింత జంతువుని చూసిన అడవి జంతువులు ఊళ్లోని ప్రజల కంటే ఎక్కువగా కంగారు పడ్డాయి.

"దీని కోరలు విషపూరితమైనవేమో," పులి అనుకుంది. "ఎంత బలంతో అది దాడి చేస్తుందో?" అని కుందేలు ఆందోళన పడసాగింది.

"మనలను పాలించటానికి దేవతల రాజు ఇంద్రుడు దీనిని పంపించాడేమో?" తెలివైన కోతి అనుకోసాగింది.

తాము క్షేమంగా ఉండాలంటే అక్కడినుంచి పారిపోవటమే మంచిదని అన్ని జంతువులు అనుకున్నాయి.





అడవిలోని బలమైన, తెలివైన జంతువులు కూడా తనను చూసి భయపడి పారిపోవటంతో 'గట్టి ఊళ' ఒక మర్రి చెట్టు కింద కూర్చుని ఆలోచించసాగింది. ఇప్పుడు దానికి ఎంతో సంతోషంగా ఉంది.

'గట్టి ఊళ' పెద్దగా ఊపిరి తీసుకుంది. తాను ఎంతో బలశాలినని, ధైర్యశాలినని అనుకోసాగింది.







అడవిలోని జంతువులన్నీ తనని చూసి భయపడటంతో తనను తాను వాటికి రాజుగా 'గట్టి ఊళ' ప్రకటించుకుంది.  దానికి పొగరు ఎక్కటమే కాకుండా అందరిమీదా పెత్తనం చెలాయించ సాగింది.

పులిని తన మంత్రిగా, నెమలిని వార్తాహరుడిగా నియమించింది. కోతులు వంతులవారీగా దానికి వింజామరలు విసిరేవి. రాజుతో మాట్లాడటానికి ముందు జంతువులన్నీ తలలు వంచి నమస్కరించేవి.

తనకి ఎంతో రుచికరమైన, బలవర్ధకమైన ఆహారాన్ని తీసుకుని రావాలని అది జంతువులను ఆదేశించింది. అవి నక్క కోసం మామిడి పళ్లు, చెరకు గడలు, అప్పుడే పట్టుకున్న ఎలకలను తెచ్చేవి.

ఇంకొక నక్కని తమ రాజుగా అంగీకరించటానికి సిద్ధంగా లేని ఇతర నక్కలు మాత్రమే ఆ అడవి నుంచి దూరంగా వెళ్లిపోయాయి.





ఒక సాయంత్రం 'గట్టి ఊళ' తనకు ఇష్టమైన గుట్ట మీద కూర్చుని ఉంది. సేవకులకు దూరంగా అప్పుడప్పుడు అలా ఒంటరిగా కూర్చోవటం దానికి ఇష్టంగా ఉండేది.

ఆ సమయంలో నక్కల గుంపు తమకి ఇష్టమైన వేట మైదానానికి వచ్చింది. అవన్నీ ఒక్కసారిగా పెద్దపెట్టున ఊళ పెట్టసాగాయి. గాలి అంతా వాటి అరుపులతో నిండిపోయింది.



ఆ ఊళలు 'గట్టి ఊళ' చెవిన పడ్డాయి. దాంతో అది తనని తాను ఆపుకోలేకపోయింది. ఎప్పుడూ వెయ్యనంత గట్టిగా, చాలసేపు ఊళ పెట్టాలని దానికి అనిపించింది.

తాను అడవికి రాజునని, మామూలు నక్కని కాదని 'గట్టి ఊళ' మరిచిపోయింది. ఆకాశంలో అప్పుడే కనపడుతున్న చంద్రుడికేసి ముఖం ఎత్తి అది పెద్దగా ఊళ పెట్టింది.



తమ రాజు నక్క లాగా ఊళ పెట్టటం విన్న ఇతర జంతువులు ఆశ్చర్యపోయాయి.

అవి అన్నీ పరిగెత్తుతూ, పాకుతూ, ఎగురుతూ అక్కడికి వచ్చాయి. మెరిసే నీలి రంగు చర్మం ఉన్న జంతువు మామూలు నక్క అని తెలుసుకున్నాయి. తమను అది మోసం చేసిందని గ్రహించి కోపంతో మండిపడ్డాయి.

గర్జిస్తూ, బుసకొడుతూ, అరుస్తూ నక్క మీద దాడి చేసి దానిని అడవి నుంచి తరిమేశాయి.

నీలి నక్క ఇప్పుడిక అడవికి రాజు కాదు.





'గట్టి ఊళ'కి మళ్లీ ఆహార సమస్య ఎదురయ్యింది. వేట కోసం అది ఎంతో కష్టపడాల్సి వస్తోంది. దాని చర్మం ఇంకా నీలి రంగులోనే ఉంది. అయితే అది మెల్లిగా వెలిసిపోతోంది.

త్వరలోనే దాని అసలు రంగు బయట పడుతుంది. బహుశ, అప్పుడు మిగిలిన నక్కలు దానిని తమ గుంపులో కలవనిస్తాయేమో.

ఒంటరిగా, విచారంగా పెద్ద పెట్టున ఊళ పెట్టే నీలి రంగు నక్క గురించి ప్రజలు కథలు కథలుగా చెప్పుకోసాగారు. అంతటి విషాదమైన ఊళని ఎవరూ విని ఉండరు.



## కథ గురించి

‘నీలి నక్క’ చాలా పురాతనమైన కథ. దీనిని సంస్కృతంలో 2200 సంవత్సరాల క్రితం రాసి ఉంటారని చెపుతారు.

ఈ కథ 84 కథల సమాహారమైన పంచతంత్రం లోనిది. జీవితంలో ఎలా వ్యవహరించాలో ఈ కథలు మనకు నేర్పుతాయి.

పంచతంత్రం పేరుతో ఈ కథలను విష్ణు శర్మ అనే పండితుడు రాశాడని చెపుతారు. మూర్ఖులైన ముగ్గురు రాజకుమారులకు శిక్షణ ఇవ్వటానికి, విజ్ఞతను నేర్పటానికి ఆయన ఈ కథలను చెప్పాడు.

పంచతంత్రం కథల అనేక అనువాదాలు అనేక దేశాలలో ప్రచురితమయ్యాయి. ఇంగ్లీషు భాషలోకి వీటిని మొదటిగా విలియం కాక్స్టన్ అనువదించాడు. యూరపు మధ్య యుగాలలో ముద్రితమైన తొలి పుస్తకాలలో పంచతంత్రం జర్మన్ అనువాదం కూడా ఒకటి.

